# జమీన్‌రైతు

Regd. No. H. No. 18
స్థాపితం: 1930
సంపుటి: 57 సంచిక: 30
25-7-1986
శుక్రవారం
12 పేజీలు: రూపాయి

స్థాపకులు: నెల్లూరు వెంకట్రామానాయుడుగారు

సంపాదకుడు: నెల్లూరు శ్రీరామమూర్తి


మండలాల ఏర్పాటు ప్రజలకు ఎక్కువ అధికారాలివ్వడానికి కాదు- ముఖ్యమంత్రి రామారావు తన అధికార పునాదులను గట్టి పరచుకొనుటకు పన్నిన పన్నాగమే!

# మండలాధ్యక్షులకు పార్టీ ఉచ్చు బిగిస్తున్నాడు!

మండలాల బిల్లు 23 తేదీ శాసన సభలో ప్రవేశపెట్టబడింది. ఈ సంచిక పాఠకులకందేలోగా అది శాసనరూపం పొందబోతుంది.

ఈ బిల్లులో మండలాధ్యక్షులలో హరిజనులు (15 శాతం): గిరిజనులు (8 శాతం) గాక కొత్తగా వెనుకబడిన తరగతులవారికి 20 శాతం, మహిళలకు 9 శాతం స్థానాలు ప్రత్యేకించబడ్డాయి. ఇంతకంటే విశేషం పార్టీమారితే పదవి పూడదం. అంటే పార్లమెంటు సభ్యులకు, శాసనసభ్యులకు ప్రస్తుతం వర్తిస్తున్న ఫిరాయింపుల నిషేధాన్ని, తెలుగుదేశం ప్రభు

మా రాజకీయ పరిశీలకుడు

త్వం మండలాధ్యక్షులకు కూడా వర్తింప చేస్తున్నది! అంతేకాదు మండలాధ్యక్షుల మీద అవిశ్వాస తీర్మానం ప్రతిపాదించే అవకాశం కల్పించబడుతున్నది. ప్రస్తుతం పంచాయతీ సమితి అధ్యక్షులమీద అవిశ్వాసతీర్మానం తెచ్చే అవకాశంలేదు.

బిల్లులమీద వ్యాఖ్యలకుముందు అందు లోని ముఖ్యాంశాలను తెలిసికొందాం.

మండల ప్రజాపరిషత్తు

సర్పంచ్ లు, శాసనసభ్యులు, పార్ల మెంటు సభ్యులు, మతరీత్యాగాని, భాషా రీత్యాగాని అల్పసంఖ్యాకవర్గాలకు చెంది ఎన్నుకోబడే ఒక సభ్యుడు -మండల ప్రజాపరిషత్తులో సభ్యులుగా వుంటారు అధ్యక్షుడు నేరుగా ప్రజలచేత ఎన్నుకో బడతాడు.

పార్టీ టికెట్ మీద ఎన్నికయ్యే మండలాధ్యక్షుడు పార్టీకి స్వచ్ఛందంగా రాజీనామా ఇచ్చినా, మండల సమావేశాల్లో పార్టీ ఆదేశానికి విరుద్ధంగా ఓటువేసినా, లేక సమావేశానికి హాజరుకాకపోయినా, మరో పార్టీలో చేరినా పదవిని కోల్పోతాడు. దీనికి కొన్ని మినహాయింపు లున్నాయి. పార్టీ ఆదేశానికి సంబంధించిన విషయాల్లో అయితే పదిహేనురోజుల లోగా తన చర్యకు పార్టీ అనుమతి పొందితే అనర్హత తొలగుతుంది. అట్లనే మూడింట ఒకవంతు సభ్యులు పార్టీ మారితే అది ఫిరాయింపు క్రిందకురాదు; వారు అనర్హులు కారు. వ్యక్తి గాకాక అసలు తాను ఏపార్టీ చిహ్నంమీదైతే పోటీ చేశాడో ఆ పార్టీ మరో పార్టీలో విలీనం కావడం అనర్హత క్రిందకు రాదు

ఈ అనర్హత కేసులను పరిష్కరించే అధికారం కలెక్టర్లకు అంటే కలెక్టర్లకు ఇవ్వబడింది.

జిల్లా ప్రజాపరిషత్తు

మండల అధ్యక్షులు, శాసనసభ-పార్లమెంటు రాజ్యసభ సభ్యులు; మతంరీత్యాగాని, భాషరీత్యాగాని ఎన్నుకోబడే ఒక అల్పసంఖ్యాక వర్గీయుడు-జిల్లా ప్రజాపరిషత్తులో సభ్యులుగా వుంటారు.

జి. ప్ర. ప. ఛైర్మెన్, వైస్‌ఛైర్మెన్లు సభ్యులనుండి సభ్యులచేత ఎన్నుకోబడతారు

రొటేషన్ పద్ధతిలో హరిజనులకు మూడు, గిరిజనులకు 1 జి. ప్ర. ప. లు ప్రత్యేకించబడినవి. మహిళలకు రిజర్వేషన్ లేదు

జిల్లా ప్రణాళికాభివృద్ధిమండలి

ఇందులో జి. ప్ర. ప. ఛైర్మెన్, జి. ప్ర. ప. సభ్యులుగావున్న శాసన-పార్లమెంటు సభ్యులు జిల్లా కలెక్టరు, మరోఇదుగురు నిపుణులు సభ్యులుగా వుంటారు ఈ నిపుణులు ఎన్నికద్వారా వస్తారా? ఎన్నికద్వారా అయితే ఎవరు ఎన్నుకోవాలి? ప్రభుత్వం నామినేట్ చేస్తుందా? బిల్లులో ఈ వివరణేమీలేదు. ధ్వనిని బట్టి ఈ ఐదు స్థానాలను నామినేషన్‌ద్వారా భర్తీ చేస్తారేమోననిపిస్తుంది,

ఈ ప్రణాళికాభివృద్ధి మండలికి ముఖ్యమంత్రి నామినేట్‌చేసే ఒకమంత్రి అధ్యక్షుడుగాను, కలెక్టరు కార్యదర్శిగాను వ్యవహరిస్తారు.

ఇవీ బిల్లులోని ముఖ్యాంశాలు.

పంచాయతీరాజ్ సంస్థల ఎన్నికలు పార్టీప్రాతిపదికమీదరాకుండా స్వేచ్ఛగా, స్వతంత్రంగా వుండడం మంచిదన్న ప్రజాభిప్రాయాన్ని తృణీకరించినప్పుడే ముఖ్యమంత్రి రామారావుగారి చిత్తశుద్ధిని శంకించవలసివచ్చింది. తనమీద మూఢ

—కొరవ 7 వ పేజీలో

# జమీన్‌రైతు

## మండల రిజర్వేషన్లు-జి. ప. అధికారాలు

ముఖ్యమంత్రి రామారావు పంచాయతీరాజ్యా వ్యవస్థను ఎట్లా మార్చాలనుకున్నారో, ఆ మార్పుద్వారా ఏఫలితాలు సాధించాలనుకున్నారో ఏమోకాని, చివరకు ఆయన చేసింది సమితులు తీసేసి మండలాలు పెట్టడం, వాటిలో వెనుకబడిన తరగతులవారికి కూడా జనవైశాల్యం రిజర్వేషను అవకాశం కల్పించడంతప్ప ఇంకేముంది?

నేరుగా ప్రజలెన్నుకునే మండలాధ్యక్షులకు అధికారాలు లేని జిల్లాపరిషత్తులో మాత్రం ప్రాతినిధ్యముంటుంది; నిధుల తాళం చెవి చేతబట్టుకున్న ప్రణాళికాబోర్డులో కూర్చేదానికి హక్కు వుండదు! జిల్లా అభివృద్ధి చర్చల్లో గొంతు వినిపించలేని మండలాధ్యక్షులు, అధికారాలులేని జిల్లా ప్రజాపరిషత్తులు ఎందుకు? ఇప్పుడుండేదానికంటే ప్రత్యేకంగా చేసిన మార్పేమిటి? ప్రజాపరిషత్తు ప్రతినిధులకు అదనంగా ఇచ్చిన అధికారాలేమిటి? అన్నీ మాటలు; అంతామోసం; అంతే!

ఇప్పుడున్న ఓటర్లజాబితాలనుబట్టి రేపు మండల ఎన్నికలు జరగాలి. ఆ జాబితాలలో వెనుకబడినతరగతులకు చెందిన ఓటరెవరో నమోదుచేయబడలేదు. వెనుకబడినతరగతులంటే ఒకటిరెండుకాదు-నూటరెండు! ఇప్పుడు కొత్తగా బి. సి. ల వివరంతోటి ఓటర్లలిస్టులు తయారుచేయించి ఆ తర్వాత ఎన్నికలు జరిపించాలి; లేదా, తాత్కాలిక సర్దుబాటుగా అధికార్ల సర్టిఫికేటుమీద ఆధారపడి వెనుకబడిన తరగతి నిర్ణయంకావాలి. మొదటే చేయాలంటే మండల ఎన్నికలు ఇప్పట్లో జరపలేరు; పైగా కొత్తగా ఓటర్లలిస్టు తయారుకావడమంటే అనవసరశ్రమ, ఖర్చు! అధికార్ల సర్టిఫికేటంటే అధికారంలో వున్న పార్టీ సర్టిఫికేటే అవుతుంది. ఆ పద్ధతి అధికార దుర్వినియోగానికి దారితీస్తుంది; సందేహంలేదు! మండలాలలో బి. సి. ల రిజర్వేషన్ల వెనుక తెలుగుదేశంప్రభుత్వ సంకల్పం ఇదేఅయితే ఏమిచెప్పి ప్రయోజనంలేదు. అది కానప్పుడు ప్రభుత్వం మరొక ఆలోచన ఏదైనా చేయడం బాగుంటుంది.

పంచాయతీ వ్యవస్థకుగా ప్రత్యేకంగా ప్రజలచే నేరుగా ఎన్నుకోబడిన ప్రతినిధులతో కూడిన జిల్లా ప్రజాపరిషత్తును నామకార్థపు సంస్థనుజేసి, ప్లానింగ్‌బోర్డును యధాతథంగావుంచి దాని అధికారాలు ముఖ్యమంత్రి నియమించే మంత్రికి, శాసనసభ, పార్లమెంటు సభ్యులకు దత్తంచేయడం ఏ కోణంనుండి చూచినా సమర్థనీయంకాదు- శాసనసభ్యులపై తన అధికారం ఆధారపడివున్నదని ముఖ్యమంత్రి వారి ఒత్తిడికి లొంగిపోవడంతప్ప జిల్లాపరిషత్తును విస్మరించడంలో న్యాయమేలేదు. ఇప్పుడు జరుగుతున్నట్లు మొక్కుబడిగా కాకుండా జిల్లాస్థాయిలో జిల్లాపరిషత్తు ఒక చిన్న శాసనసభగా పనిచేయగలిగితే, సంస్థకు సార్థకత, విలువగాని ప్రాణంలేని పరిషత్తు ఎందుకు? శాసనసభ్యులు ఏ పార్టీ అధికారంలోవున్నా తమ అధిత్యతను నిలబెట్టుకోడానికి ప్రయత్నిస్తుంటారు. ఒకవిధంగా అది నిరంకుశ ప్రవృత్తే అవుతుంది. పరిషత్తులోకాని. మండలాలోకాని వారు తమమాటకూ చెలామణిని కోరవచ్చు; అధికారాన్నంతా తమ హస్తగతం కావాలని ఆశించడం మాత్రం భావ్యంకాదు. ఇప్పటికైనా మునిగిపోయిందిలేదు; ప్లానింగుబోర్డును రద్దుచేసి, పూర్వంవలెనే జిల్లాపరిషత్తుకు పరిపూర్ణత్వం కల్గించి, అందులో శాసనసభ్యులతోబాటు మండల అధ్యక్షులనుకూడా భాగస్వాములు గావించడం భావ్యంగావుంటుంది.



## జమీన్ రైతు

24-7-1936

నెల్లూరు వార్తలు

కాంగ్రెసు సోషలిస్టుపార్టీ యువజన సంఘము కార్మిక సంరక్షణ సంఘాల యాజమాన్యమున 1 తేదిన తిప్పరాజువారి సత్రంవద్ద బహిరంగ సభ జరుపబడుననియు, యుద్ధంవల్ల వచ్చే విపత్తు, యుద్ధసమయములలో స్వరాజ్య పోరాటము మున్నగు విషయముల గురించి ఉపన్యసింపబడునని చుండి జగన్నాథం, రావి ఆదిశేషయ్య గారలు తెలుపుచున్నారు.

• • •

కాంగ్రెసునాయకులు టవునులోను పల్లెలలోను కాంగ్రెస్ సభ్యులను విరివిగా చేర్పుచున్నారు. గోపాలరెడ్డి, హనుమారెడ్డి, హనుమంతరావుగారలు 22 సాయంత్రం కోవూరు వగైరా ప్రదేశములకు వెళ్ళిరి. కార్మికులను హెచ్చుమందిని కాంగ్రెసుసభ్యులుగా చేర్పుతున్నారు. రాఘవయ్యగారు, ఓ. వెంకటసుబ్బయ్య, లక్ష్మయ్య, గోపాలరావు, హనుమంతరావు ప్రభృతులు టవునులో సభ్యులను చేరుస్తున్నారు. గోపాలరెడ్డిగారు ఆత్మకూరు ప్రాంతమున సంచరించుచున్నారు సభ్యులను చేర్పుటకు.

జిల్లా కాంగ్రెసు కమిటీ మీటింగు 29 తేది నెల్లూరులో జరుగును.

నెల్లూరు ముచ్చట్లు

మూర్ఖాళ్ళ దివానుగిరిలో గవర్నమెంటు, కలెక్టరు ప్రభృతులు దివాను

### 50 ఏళ్ల క్రితం ఈవారం

హోదాలో రెడ్డిగారిని అనుసంధిస్తే, కందుకూరు డిప్యూటీకలెక్టరుగారు మాత్రం "చుండి దివానని నాను పిలుచుకొనవలే ఆదిశేషారెడ్డిగారికి" అని నంబోధించి వ్రాశారట, గుట్టు తెలిసి వ్రాసిందేనంటారా ఈ ముక్క.

• • •

మునిసిపల్ అధ్యక్ష పదవి తాలూకా ఆఫీసులో పుండి ఉద్యోగం చాలించుకొని, ప్రైవేటు వకీలుగా ప్రాక్టీసు చేస్తున్న కొండపల్లి నారాయణరావు గారిని రెడ్డిగారిస్తానే దివానుగా అపాయింటు చేశారట చుండి. ఆదోగమూదిరిత్తిషు. ఇంతకు వీరు ఆప్పనంపాదించగలిగితేగదా దివానుగిరి దక్కడం ఒక పేష్కష్ రాయించా దాటితే చూస్తాం.

• • •

నాయుడుపేట యూనియనుబోర్డును రద్దుచేయించిన కేతుగ్రహమే, తిరుగా ఎన్నికలుజరపాలని చంద్రగ్రహణంగా మారడంకుఖోదంతమే! పౌరకార్యంలో పార్టీలేమిటి?

మొలలోతు అధికారాలే వసేదు:ఖంలో మోకాటిబంటి విశ్వనాధరావుగారు ఇవాలెక్షి చేర్‌మేన్ అయినాడనే సంతోషం కొంత పూరటగానే వుంటుంది. ఎన్నాళ్ళు? పదిరోజులు. రెడ్డిగారు మద్రాసునుండివచ్చినాకైనా పార్టీభేదాలు మరచి అందరు యేకమైపోయి ప్రజలకు సేవచెయ్యాలనే ఆశిస్తున్నాం. ★

# కులాల మధ్య చిచ్చు పెట్టవద్దు!

ముఖ్యమంత్రి ఎన్టీఆర్ రిజర్వేషన్ల పేరుతో, రాష్ట్ర ప్రజలలో చిచ్చుపెట్టి, కులమతాలను రెచ్చగొట్టారు. ఇప్పటివరకు రాష్ట్రంలో అక్కడక్కడా మత వైమనస్యాలున్నాయేగాని, ఎక్కడా కులం పేచీలు లేవు. ఒకే కుటుంబంవలె మెలగుతుండిన ప్రజలలో విభేదాలు సృష్టించి, చిచ్చుపెడుతున్నారు.

ఇప్పుడీ రిజర్వేషన్ల పెంపుదల పూర్తిగా రాజకీయ ఎత్తుగడే; పంచాయితీ మండలాల ఎన్నికలలో ఓట్లకోసం పడుతున్న కక్కుర్తే! రాష్ట్రంలో వెనుకబడిన తరగతులవారెందరో ఆర్థికంగా అడుగున వున్నమాట వాస్తవం; అయితే అంతకుమించి అగ్రవర్ణాలవారుకూడా, పెద్దచదువులుచదివి, గొప్పడిగ్రీలు తెచ్చుకొని కూడా కూటికోసం కటకటలాడుతున్నారు. ఇప్పటికే రకరకాల రిజర్వేషన్లతో వీరికి విద్య, ఉపాధి అవకాశాలు క్షీణించాయి. ఎన్టీఆర్ ఓట్ల టిక్కుతో వారి బ్రతుకు మరీ నికృష్టమైపోతుంది.

సమాజంలో ఒక ప్రత్యేకవర్గం సరైన అవకాశాలు దొరకక అడుగున పడిపోవడం మంచిదికాదు; అయితే వారిని అభివృద్ధి చేయడమనే సాకుతో, ఇతరవర్గాల ప్రజలను అణగద్రొక్కడం సహించరాని నేరం. అగ్రవర్ణాలకు అపకారం జరగని రీతిలో, వెనుకబడిన తరగతులకు ఉపకారం చేయడానికి మార్గాలు అన్వేషించి విజ్ఞులతో సంప్రదించి నిర్ణయాలు తీసు




కోవాలి. అసలు రిజర్వేషన్లద్వారా తప్ప, కొన్ని వర్గాలను అభివృద్ధి పరచలేమనుకోవడం పచ్చి మూర్ఖత్వం అదీ కులాల పేరుతో జరగడం ఇంకా అనాగరికం. రిజర్వేషన్ల విధానమంటూ పాటిస్తే, ఆర్థిక స్తోమత ప్రాతిపదిక కావాలి.

ఎన్టీరామారావు, రాష్ట్రంలో కులాల మధ్య చిచ్చురేగకముందే తన నిర్ణయాన్ని పునఃపరిశీలించుకోవడం మంచిది.

నెల్లూరు — ఎస్. రామారావు

### పి. డబ్లు. డి. నా? గుర్రపుడెక్క శాఖా?

పెన్నకు ప్రవాహంవచ్చి, కాల్వల క్రింద డెల్టాప్రాంతంలో పైరు సాగౌతుందన్న నమ్మకం ఎవరికీ లేదు. ఇప్పుడు వానదినుసులతోనైనా పర్వేకల్లి, కృష్ణాపట్నం కాల్వలలో నీరు పారుతాయన్న నమ్మకం నశిస్తూంది ఈ కాల్వలలో నీటికి సందులేకదా - మొత్తం గుర్రపుడెక్కల ఆకు పరుచుకొనిపోయి వుంది.

పెళ్ళకూరు రామచంద్రారెడ్డిగారు ఒకసారి, పెన్న డెల్టా ఆధునీకరణకు రెండుకోట్లు మంజూరు చేయించారు వాటితో ఇప్పుడు కాల్వలకు కాంక్రీటు లైనింగ్ వేస్తారట. మొదటిభార్య బిడ్డలకు గంజినీళ్లకు గతిలేకుంటే, రెండవ భార్యకు బిడ్డలు లేరని పుత్రకామేష్టి యాగంచేయడానికి ప్రయత్నించాడట, ఒక ప్రభుద్ధుడు. అట్లావుంది పి.డబ్ల్యు డి. వారిపని. గుర్రపుడెక్క ఆకుతీయడం చేతకాని ఈ ప్రబుద్ధులు, కాంక్రీట్ లైనింగ్‌వేసి ఎవరిని ఉద్ధరిస్తారు?

-ఈపూరు వెంకురెడ్డి.

గుడ్లూరివారిపాలెం

## మేము-మీరు

### దోపిడీకాదు-సేకరణ

కావలి విశ్వోదయ స్కూళ్ళు విద్యార్థులను దోచేస్తున్నాయని (జులై 11 తేది) వ్రాశారు. అది తప్పు మేము కేవలం విరాళాలు సేకరిస్తున్నాము. తల్లిదండ్రుల సంఘానికి ప్రతి విద్యార్థి దగ్గర రు 5 లు చందా క్రింద దండాలని ఇదివరకొకసారి తీర్మానించుకున్నాం. ఇప్పుడు ఆ నిధులతో అభివృద్ధి కార్యక్రమాలు చేపడుతున్నాం. ఈ పనులతో స్కూలు యజమాన్యానికి ఎటువంటి సంబంధంలేదు. తల్లిదండ్రుల సంఘం చేపడుతున్న మంచినీటి కొళాయిలు, మరుగుదొడ్లవంటి సౌకర్యాల కల్పనవంటివి అంకరి ప్రశంసలు పొందుతున్నాయికూడా!

గ్రామీణ క్రాంతి పథకం, స్వర్ణోత్సవ

-కారవ 7వ పేజీలో

# ఆడపిల్ల అర్ధరాత్రి ఒంటరిగా తిరిగే సుందర స్వప్నం రష్యన్లు నిజం చేశారు!

మాస్కోలో
మూడురోజులు
. . .
మోదాల జానకిరాం

సోవియట్ రష్యాలో కొన్ని రోజులు గడిపి వచ్చిన తర్వాత నా కన్పించింది- భారతదేశంలో మనం ఊహించుకుంటున్నది నిజమైన స్వాతంత్ర్యమేనా? అని; వారితో పోలిస్తే మనది అసలైన స్వాతంత్ర్యమా అన్న సందేహం కూడా కల్గుతుంది. రష్యాలో ప్రజలు మనమనుకుంటున్నట్లు లేరు. భావాలను వంచెత్తువేసుకుని బ్రతకడంలేదు; మన కంటే సుఖంగా జీవిస్తున్నారు; ప్రపంచంలో ఏ ప్రజాస్వామ్య దేశంలోనూ లేనంత స్వతంత్రంగా జీవిస్తున్నారు. మాస్కో మహానగరం వీధుల్లో అర్ధరాత్రి రెండుగంటలకు ఒక అందమైన యువతి నిర్భయంగా నింపాదిగా ఒంటరిగా నడిచిపోగలుగుతున్నదంటే-అంత కంటే అధికమైన స్వాతంత్ర్యం ఎక్కడుంటుంది?

వ్యాపారనిమిత్తం నేను రష్యా వెళ్ళాను; కొన్ని ఎగుమతి ఆర్డరు ఒప్పందాలపై సంతకాలు చేయడం, మనదేశం ఉత్పత్తులపై వారికున్న అపోహలు తొలగించడం నా కర్తవ్యనోద్దేశ్యం. 28 తేది రాత్రి ఢిల్లీనుంచి. ఎయిరోఫ్లాట్ విమానంలో బయల్దేరాను. మూడు గంటల ప్రయాణం తర్వాత, అర్ధరాత్రి 2 గంటలకు తాష్కెంట్ విమానాశ్రయంలో దిగింది మా విమానం. మాజీ ప్రధాని స్వర్గీయ లాల్‌బహదూర్‌శాస్త్రి తుది విశ్వాసం విడిచిందిక్కడే. పెట్రోలు పట్టించుకుని తిరిగి బయల్దేరడానికి మాకు ఒకగంట వ్యవధినిచ్చారు. ఈ లోగా ఎయిర్‌పోర్టు పరిసరాలన్నింటినీ తిరిగాము. తర్వాత అక్కడినుంచి బయలుదేరి ఉదయం 7-30 కి మాస్కో చేరాము. ఎంతో ప్రశాంతమైన రూపంలో, బాల భాస్కరుడు మాకు స్వాగతంచెప్పాడు. సాధారణంగా అయితే ఇక్కడీసమయంలో చాలావరకలిగా వుండేదట,

విమానాశ్రయంలో అన్ని తతంగాలూ ముగిసేసరికి గంట పట్టింది; తర్వాత, మాస్కోనగరంలోని అతిపెద్ద హోటల్ "రాస్సియా" చేరాం; ఇందులో 2 వేల గదులున్నాయట. ఫైవ్‌స్టార్ హోటల్ అయినప్పటికీ రూంసర్వీసుమాత్రంలేదు. అందువల్ల ముఖప్రక్షాళనం త్వరగా ముగించుకుని, ఉదయాహార విందారగించాను. 10 గంటలైతే రెస్టారెంట్ మూత పడుతుందట.

హోటల్ లో భోజనంకాని, అల్పాహారంగాని చాలాబాగున్నాయి; నాతోటి "గ్రావెక్కిన"మనిషికి ప్రకృతి చికిత్స చేయించుకున్నట్టుండింది. తీరా కరెంతా భోజనానికెళ్ళి. గదిబయటకు రాలేదు. సాయంత్రం మాత్రం ప్రపంచ ప్రఖ్యాతిచెందిన మాస్కోసర్కస్‌చూశాం.

మాస్కో ప్రజల జీవన విధానంలో మనలోతెవాళ్లం తెలుసుకోదగిన అంశాలు చాలానేవున్నాయి. ఇక్కడి ప్రజల బ్రతుకు ఎంత ప్రశాంతంగా వుంటుందో, అంత పదిలంగానూ కన్పిస్తుంది. చింత, వంతలు లేవు; ఆందోళన, భయం అసలే లేవు. నగరమంతా వెతికినా ఆకలి చిహ్నాలు కల్గిన ముఖమే కన్పించదు. పైగా ప్రజలలో ఆశ్చర్యంగొల్పే క్రమశిక్షణ. ఎవరి ఒత్తిడివల్లో ఇది జరగడం లేదు; క్రమశిక్షణ రష్యాప్రజల జీవన విధానంలో ఒకభాగంగా కన్పిస్తూంది. మాస్కోనగరం మనదేశంలోని పట్టణాల వలెకాక, ఎంతో పరిశుభ్రంగా వుంది.

ప్రజలలో దేశభక్తికూడా అపరిమితం. ఒక్క సగటుపౌరుడికీ కూడా విద్య, ఆహారం, వస్త్రాలు, ఇళ్ళు వంటి సౌకర్యాల కొరతలేదు. అందరికీ అన్నీ దొరుకుతున్నాయి. పైగా వారిలో కష్టించి పనిచేసే తత్వం కూడా కన్పిస్తూంది. నేనే ఈ దేశం పౌరుడ్నే అయివుంటే అందుకు నేనెంతో గర్వపడివుండేవాడిని.

మొత్తం ప్రపంచంలో ఆడా, మగల మధ్య అంతరంలేని దేశం ఒక్క రష్యానే అవుతుందేమో! వీరిద్దరూ తాము సమానులమని భావిస్తున్నారు; సమాజము వారిని సమభావంతోనే చూస్తున్నది. మాస్కోనగరంలోని ప్రశాంతత కూడా నన్ను ముగ్ధుడ్ని చేసింది. మనదేశంలో మనం నిత్యంచూసే గడబిడలు, అశాంతికి దారితీసే అసాంఘిక సంఘటనలు ఒక్కటికూడా కన్పించలేదు.

మాస్కో భూగర్భ రైల్వేమార్గం ఒక అద్భుత విజ్ఞాన విషయం. ఈ రైలు మార్గంలో దారిపొడవునా చిల్లరయిచ్చే యంత్రాలుకూడా వున్నాయి. మనకెంత అవసరమైతే అంతా సులువుగా తీసుకోవచ్చు.

మాస్కోలోని 'రెడ్‌స్క్వేర్' చూశాం; రష్యా ప్రజలు జార్ చక్రవర్తి నుంచి స్వతంత్రం ప్రకటించుకున్నది ఈ చారిత్రాత్మక ప్రదేశంనుంచే! పురాతన కట్టడాలు, చారిత్రక నిర్మాణాలను పదిలపర్చుకోవడంలో రష్యాప్రజలు ఎంతో నేర్పరులు; వారినిచూసి మనం నేర్చుకోవలసింది చాలావుంది.

మాస్కోలో దొంగతనాలు, దోపిడీలు లేవు; ప్రజలకు ఇటువంటి భయాలసలే లేవు. ఈ మహోన్నతసమాజం నిర్మించుకోవడానికి వారు ఎన్నోత్యాగాలు చేసి వుండవచ్చు; కాని తామనుకున్నదెల్లా సాధించి, ప్రపంచంలోనే అత్యంత శక్తివంతమైన రాజ్యంగా రూపొందగల్గింది. నాకు అనిపిస్తున్నది- ప్రపంచంలోనే అత్యంత సంపన్నదేశమైన అమెరికా, తన ప్రజల క్రమశిక్షణా రాహిత్యంవల్ల రష్యాకు లొంగిపోవలసి వస్తుందేమోనని; సోవియట్ పాలకులు తమ ప్రజలలో పాదుకొల్పగల్గిన క్రమశిక్షణాభావం ఎంత గొప్పగావుందంటే, వారేరోజుకైనా ప్రపంచంలో ఏదేశాన్నైనా అవలీలగా జయించగల బలం సమకూరుస్తుంది.

రష్యా ప్రజలు తామీరోజు తమదేశం సాధించినవిజయాలపట్ల అపరిమితగర్వం ప్రదర్శిస్తున్నారు. వారికాహక్కు వుంది.

—కొరవ 10 వ పేజీలో

ఎం అర్ ఓ తో 'సర్దుకో'మన్నాడట మంత్రి!

# బి.సి. సర్టిఫికేట్ల తిరస్కృతి- ఓజిలి మండలంలో అలజడి!

ఓజిలి మండలంలో రాదాపెద్ద అల జడి జరుగుతూంది. విద్యార్థులకు వెనుక బడిన తరగతులకు చెందినవారన్న సర్టిఫికేట్లు జ ఇవ్వడానికి ఎం. ఆర్. ఓ. నిరాకరిస్తున్నారట ప్రభుత్వం కొత్తగా ప్రకటించిన అగ్నికులక్షత్రియ, దూదే కుల కులాలకు చెందినవారిని అ వ ఉ దగ్గరకే రానివ్వడంలేదట. మన జిల్లాలో ఆ రెండుకులాలవారూ లేరని, వుం డే వారు వెనుకబడిన తరగతులకు చెందిన వారుకారని ఆయన వాదమట. నిజానికి రాష్ట్ర ప్రభుత్వం రిజర్వేషన్ల హెచ్చింపుతర్వాత కొత్తగా ప్రకటించిన జాబితాలో, ఈ రెండు కులాలకేర్లూ వున్నాయి.

ఇప్పటివరకు ఈ కులాల పేర్లతో సర్టిఫికేట్లు వున్నవారికూడా, పై తర గతులకు కాలేజీలకు దరఖాస్తుచేయ డానికి సర్టిఫికేట్లు ఇవ్వడంలేదట. ఈ తిరస్కృతి ఓజిలి మండల గ్రామాలలో

జిల్లావార్తలు

తీవ్ర అలజడి సృష్టిస్తూంది. తెలుగు దేశానికి చెందిన కొందరు యువకులు ఆ మధ్య రెవిన్యూ మంత్రివర్యుల వెళ్ళి, తమ సమస్య చెప్పుకోబోతే, మీరే ఆ ఎం. ఆర్. ఓ తో 'సర్దుకోండి'. అని సమాధాన జర్పి పంపాడట; సర్దుకోవడమంటే అర్థమేమిటో తెలియక పాపం ఆ పిల్ల కాయలు జుట్టు పీక్కుంటున్నారు.

అయితే మంత్రిగారు మీతో సర్దేసుకో మన్నారని ఎం. ఆర్ ఓ తో చెప్తే, ఆయన ససేమిరా కుదరదని ఖండితంగా చెప్పాడట.

ఒకవంక కాలేజీలు ప్రారంభం అవు తుండడం, ఇంకోప్రక్క అధికారులు తమనిట్లా వేపుకతినడంతో విసిగిపోయిన తెలుగు యువకులు కొందరు, మొన్నొక రోజు నిలమూ చేన్‌లో హాస్టలు భవనానికి శ్రీనివాసులురెడ్డి వేసిపోయిన పునాది రాయిని బ్రద్దలు చేశారట.

ఓజిలి ఎం. ఆర్. ఓ. బి సి సర్టిఫి కేట్లు నిరాకరిస్తుండడాన్ని గమనించిన మరికొందరు చుట్టుప్రక్కల మండలాధి కారులుకూడా ఇప్పుడు మొండి చేయి

—కొరవ 10వ పేజీలో

# జనార్దన రథం కదలింది!

జనార్దన రథం కదలింది; మొన్న 20 తేదీ గూడూరు తాలూకా గునుపాడులో రథచక్రాలు ఒకచుట్టు తిరిగాయి; ఆ రథం ముందు గూడూరు డివిజన్ పూర్తి జేసు కొని తర్వాత జిల్లాలోని అన్నికుంత లాలు పర్యటించి, కాంగ్రెస్ సమావేశాలు జరిపి, కాంగ్రెస్ వాదులను సంఘటిత పరచి, జిల్లాలో కాంగ్రెస్‌ను పూర్వో న్నత స్థితికి తెచ్చేవరకు విశ్రమించదట.

జనార్దనరెడ్డి కొత్తగా కదలడమేమిటి అనవచ్చు. అట్లనే అనిపిస్తుంది; కాని నిజంగా ఆయన ఇంతకాలం కాంగ్రెస్ ప్రత్యక్ష కార్యకలాపాలకు ఎందువల్లనో కాస్తదూరంగానే వుంటున్నాడు. పరిస్థి తులు అనుకూలం కానందువల్ల కావచ్చు; వుత్సాహంచచ్చిపోయినందువల్లకావచ్చు; నిరాశ నిస్పృహలవల్ల కావచ్చు; వేచి చూడడంమేలనుకొనివుండవచ్చు. కారణం ఏదైతేనేమి ఇంతకాలం ఆలోచన ఆవే దన ఆందోళనా సమాధిలో అజ్ఞాతంగా వుండిపోయిన జనార్దనరెడ్డి కదలవలసిన సమయం వచ్చిందనుకున్నాడేమో కది లాడు; దానికి గునుపాడులో ప్రారంభో త్సవంజరిగింది. ప్రారంభానుభవం అపూ ర్వం అనిర్వచనీయంఅంటూపొంగిపోయి గంతులేశారు అక్కడపాల్గొనవచ్చినవారు!

గునుపాడు అంటే ఓజిలి, కురుగొండ దాటి, ఎక్కడో ఏ మారుమూలో కృత్రిమ నాగరికతకు కాస్త దూరంగావున్న గ్రామం; సమావేశం గ్రామంలోకూడా కాదట; గ్రామం వెలుపల దారి డొంకలేని ఒక మామిడితోపులోనట. ట్రంకురోడ్డు దిగి ఆ దుమ్ముగొట్టుతో వరుసబెట్టి పదుల సంఖ్యలో కార్లు పరుగిస్తుంటే. అవి ప్రభుత్వానివి- అధికారంలో వున్న వారివి కాదని తెలుసుకున్నపుడు ఆ సంరంభం చూపరులకు విపూత్నంగా ఆశ్చర్యంగానే వుండివుండాలి!

గూడూరు డివిజనుకు సంబంధించిన కాంగ్రెసు ముఖ్యుల రహస్య సమావేశ మట అది వచ్చిన ప్రతిఒక్కరు సంస్థ పట్ల భక్తిశ్రద్ధలు కలిగిన కాంగ్రెస్ కార్య కర్తలేనన్నారు. మామూలు సాదాసీదా పూలదండలు వుపన్యాసాలుకాకుండా, ఎన్టీఆర్‌నో నల్లపరెడ్డివారినో తిట్టి సరి పెట్టుకునే సభగాకాకుండా; భవిష్యత్ కర్తవ్యాన్నిగూర్చి, కార్యక్రమాన్ని గూర్చి వాస్తవికదృష్టితో సమాలోచించు కొని కార్యరంగంలోకి వురకడానికి శక్తి జాన్ని వుత్సాహాన్ని పుంజుకొని గృహో న్ముఖమైన సమావేశమట అది.

కార్యకర్తలలోని వుత్సాహాన్ని దీక్షను చూస్తే తనకూ ఎంతో వుత్సాహం కలిగిందన్నాడు జనార్దనరెడ్డి. పార్టీ కి అంకితమయ్యే కార్యకర్తలు గూడూరు డివిజనులో ఇంతమంది వున్నారా అని తనకు ఆశ్చర్యం కలిగిందనికూడా అన్నారు ఆయన. ఇదేమాదిరి సమావే శాలు జిల్లావ్యాప్తంగా జరిపి, కాంగ్రెస్ కార్యకర్తలను చైతన్యవంతులనుజేసి, సంస్థను పూర్వస్థితికి పతిష్టం గావించా లనేది తమ సంకల్పమని జనార్దనరెడ్డి చెప్పారు.

గునుపాడు సమావేశానికి జిల్లా కాం గ్రెస్ అధ్యక్షుడు శ్రీ కె.వి సుబ్బారెడ్డిని ముందుగానే ఆహ్వానించారట: కాని ఎందువల్లనో ఆయన పోలేదట; పోయి వుంటే బాగుండేది.

—ఓ.వి.



# సర్వోదయమా చట్టుబండలా!

నెల్లూరులోని ఒకానొక కాలేజీలో, ఇంటర్మీడియెట్ సీట్లను వేలంపాటలో విక్రయిస్తున్నారని పెద్ద వదంతి.

ఈ ఏడాది ఇంటర్‌సీట్లకు, మరీ ముఖ్యంగా సైన్సుగ్రూపులకు కటకటగా వుంది. ఇదివరకటిరోజుల్లో 'ఫస్ట్‌క్లాస్' అనేది విశేషమైన విషయం 70, 75 శాతంవరిచ్చి, డిస్టింక్షన్ తెచ్చుకున్న విద్యార్థులకు భవిష్యత్తంతా బంగారు మయంగావుండేది. అత్తెసరు మార్కుల, నగటు స్టూడెంట్లకుతప్ప, ఇటువంటివారికి కాలేజిసీటు అసలు సమస్యగానేవుండేది కాదు,

ఇప్పుడుపరిస్థితి పూర్తిగా తారుమారు. 75 శాతం మార్కులు తెచ్చుకున్నవారికి కూడా సీట్లు రావటంలేదు. ఒక కాలే జిలోఅయితే పోటీ మరీదారుణంగావుంది.

ఇది అలుసుగా తీసుకుని నెల్లూరులోని ఒక ప్రైవేటు కాలేజీ యాజమాన్యం విద్యార్థులతో వ్యాపారం మొదలు పెట్టిం దని వదంతిగావుంది. కాలేజిలో ఎలక్ట్రా నిక్స్‌కు సంబంధించిన అధునాతనకోర్సు కూడా ఒకటి వుందట. దానిలో సీటు కావాలంటే ఐదువేల రూపాయల రొక్కం సమర్పించవలసిందేనట: ఎం. పి. సి. నంటి పోటీగల సబ్జక్టులలో సీటుకైతే రెండువేలనుంచి వేలంపాట మొదలౌ తూందట.

మరీ సీట్లను ఇంత బహిరంగా, బోరుగా అమ్మడం సమంజసం గాదని కాలేజి ప్రిన్సిపల్ చెప్పబోయారట: కానీ నవరించుకోటానికి ఏకులు లేకకాకుంటే, సెలవుపెట్టి వెళ్ళిపొమ్మన్నా అతన్ని ఆదే శించారని ఒక పుకారుపుట్టింది. విచారిస్తే, ఇప్పుడు కాలేజి ప్రిన్సిపల్ సెలవుపైవెళ్ళి

## రెండువేల నుంచి ఐదువేలదాకా వేలంపాట?

వున్నారట. ఈ రెండు వదంతులను సమన్వయంతో చూసుకుంటే, అపుకారు నిజమేమో ననుకోవలసివస్తూంది.

ఒక కాలేజిలో ఆది విద్యార్థులకే నేరుగా సీట్లు అమ్మకానికి పెడుతున్నా రంటే ఏమనుకోవాలి? చిన్నచిన్న కాన్వెంట్ స్కూళ్ళలో నే డొనేషన్లంటే ఐడితెపూజ చేస్తామని బెదరిస్తూంది ప్రభుత్వం. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల నుండి ఏటా లక్షల రూపాయల నిధులు దండుకునే పెద్ద కాలేజీలే ఇంత కక్కు ర్తికి పాల్పడితే అడిగేదిక్కు లేదా? ★

## నెల్లూరు నలుచెరగుల్లో
### విహార్మకుడు

### జువ్వలదిన్నె జాలర్లు- నౌకాదళానికి పిలుపు

కావలితాలూకా జువ్వలదిన్నెనుంచి సముద్రంలోనికివెళ్ళి జాడతెలియకుండా పోయిన 28 మంది జాలర్లను వెతకడా నికి జాయింట్ కలెక్టర్ శ్రీ దయాచారి, విశాఖపట్నంనుంచి నౌకాదళం హెలి కాప్టర్లను రప్పించడానికి తీవ్ర ప్రయ త్నంచేస్తున్నారు. ఈమేరకు విశాఖ లోని కమ్యూ, నౌకాదళం అధికారులకు విజ్ఞప్తులుకూడా వెళ్ళాయట. దానితోపాటు, తీరప్రాంతంలోని అన్ని పోలీసుస్టేషన్లు, ప్రభుత్వ కార్యాలయాలకు సందేశం కూడా పంపారు.

13 వ తేది ఉదయం ఈ గ్రామంనుంచి 15 పడవలలో పెక్కుమంది జాలర్లు సముద్రంలోకి వెళ్ళారట. అయితే వీటిలో 10 పడవలుమాత్రం ఐదురోజులతర్వాత తిరిగివచ్చాయి; ఒకపడవ తర్వాత రెండు రోజులకు కాకినాడరేవు చేరిందట. తక్కిన నాలుగు పడవలు ఇంకదాకా అంతులేవు. సముద్రంలో ఏదైనా సుడిగాలి వంటిది వీచివి చుట్టుముట్టినందువల్లనో, మరేదైనా ప్రకృతివిపత్తు సంభవించో వీరు సము ద్రంలో దూరంగా కొట్టుకొ, పోయి వుంట వచ్చునని భావిస్తున్నారు. వీరి పడవలు యాంత్రికమైనవికావు- నాటు కాకినాడ పడవలు.



### అభినందనలు

కావలి డివిజనల్ పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్‌గా వుండిన శ్రీ ఎం. రామమూర్తి గుంటూరు డి. పి ఆర్ ఒగా ప్రమోషన్ మీద నియమితులయ్యారు.

ఒకరు వ్రాస్తే సంతకం పెట్టడం కాకుండా, రామమూర్తి ఏ విషయాన్నయినా చక్కగా వ్రాయగలరు; కష్టపడి పనిచేయగలరు; అందరితో స్నేహసౌహార్దాలతో మెలగగలరు. అన్నివిధాల పౌరసంబంధశాఖాధికారిగా అర్హుడు

ప్రమోషన్ పొందిన శ్రీ రామమూర్తికి మా అభినందనలు.

### కావలి మేజిస్ట్రేటు- అడ్వొకేట్ల బహిష్కరణ

కావలి జుడిషియల్ ఫస్ట్‌క్లాసు మేజిస్ట్రేటు శ్రీ జగన్నాధరావు వైఖరికి నిరసనగా కావలి న్యాయవాదులు జూన్ 20 తేదినుంచి ఆయన కోర్టుకు హాజరు కాకుండా సమ్మెచేస్తున్నారు.

ఆయన పోలీసులతో సన్నిహిత సంబంధాలుపెట్టుకొని, కోర్టుకు హాజరు పరచిన ముద్దాయిలకు బెయిల్ ఇవ్వడమో లేక జుడిషియల్ కస్టడీకి పంపడమో చేయకుండా అక్రమంగా వారిని పోలీస్ స్వాధీనపరచుకునే విధంగా ప్రవర్తిస్తున్నాడని కావలి బార్ అసోసియేషన్ ఏకగ్రీవంగా తమ నిరసనను హైకోర్టుకు, జిల్లాజడ్జికి తెలియజేసి జూన్20నుండి కోర్టు బహిష్కరణ ప్రారంభించారు. అందుమీదట, జిల్లాజడ్జి జూన్ 25 తేది విచారణ జరిపారు. కాని ఇంతవరకు చర్యలేదు. న్యాయవాదుల సమ్మె వల్ల కక్షిదార్లు ఇబ్బందిపడిపోతున్నారని కాబట్టి హైకోర్టు వెంటనే మేజిస్ట్రేటును బదిలీ చేయవలసిందిగా న్యాయవాద సంఘం అధ్యక్షుడు శ్రీ పంబేటి రమణా రెడ్డి విజ్ఞప్తి చేస్తున్నారు!

జుడిషియల్ మేజిస్ట్రేట్‌కు వ్యతిరేకంగా న్యాయవాదులు సమ్మె చేయడమనేదే తీవ్రమైన విషయం. అటువంటిది నెలరోజులు పైనుంచి సాగుతున్నా ఏ చర్యా తీసుకోకపోవడం ఆశ్చర్యాన్ని కల్గిస్తున్నది

### అన్సారీకి సన్మానం

నెల్లూరు రేబాల లక్ష్మీనరసారెడ్డి 73 వ జయంతి సభ, 18 తేదిన టౌన్ హాల్‌లో జరిగింది. కాశ్మీర్ హైకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి, ప్రస్తుత అం. ప్ర. మైనారిటీస్ కమీషన్ ఛైర్మన్, నెల్లూరీయుడు శ్రీ ఎం. ఎ. అన్సారీని ఈ సభలో సన్మానించారు. డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి అధ్యక్షత వహించారు. మానవులంతా ఒకటే అనే నినాదం ప్రజలలో వ్యాపింపజేసి, భాషామతవైమనస్యాలను నిర్మూలించగలంటే, దేశప్రగతికి అర్థముంటదన్నారాయన

సభను ఆర్వెల్ రెడ్డి ధర్మనిధిసంఘ సభ్యుడు శ్రీ జె. వి. రెడ్డి స్వాగతించారు; వర్తమానసమాజం కార్యదర్శి శ్రీ అగస్త్య రెడి వెంకురెడ్డి అన్సారీకి సన్మానపత్రం సమర్పించారు; శ్రీ గోనుగొండ వెంకట సుబ్బయ్య వందనాలు చెల్లించారు. సభానంతరం నృత్య ప్రదర్శనలుచేసిన మద్దాలి అపర్ణ సవిత్రులను శ్రీ జె. వి. రెడ్డి సత్కరించారు. శ్రీ వేణుంబాక వీరరాఘవరెడ్డిగారు కూడా సభలో పాల్గొన్నారు.

### కాలేజి ఎన్నికలు

నెల్లూరులోని నాలుగు కాలేజీల విద్యార్థి సంఘాలకు ఎన్నికలు జరిగాయి. నాలుగింటినీ ఎ.బి.వి.పి., ఎస్.ఎఫ్.ఐ అభ్యర్థులే పంచుకున్నారు. గోడలమీద ఆర్భాటంగా కన్పించే ఎన్. ఎస్. యు. ఐ. విద్యార్థులలో వట్టిదేనని తేలిపోయింది; తెలుగు విద్యార్థి కూడా బోల్తా కొట్టింది. కొత్తగా ఎన్నికైన అభ్యర్థులు వీరు-

వి. ఆర్. కాలేజి - అధ్యక్షుడుగా శ్రీ ఎన్. చంద్రశేఖరరాజు, ఉపాధ్యక్షుడుగా శ్రీ పి. శ్యామకుమారరెడ్డి, కార్యదర్శిగా శ్రీ కె. శ్రీధరరెడ్డి, లలిత కళల కార్యదర్శిగా శ్రీ సి. జనార్ధనరాజు, విద్యార్థుల ప్రతినిధిగా శ్రీ పి.హెచ్. సుగాత్రి ఎన్నికైనారు; వి.ఆర్. సాయంత్రం కళాశాల- అధ్యక్షుడు శ్రీ కోటేశ్వరరావు, ఉపాధ్యక్షుడు శ్రీ పి. వినోద్‌బాబు, కార్యదర్శి శ్రీ ఎస్. శ్రీనివాసులురెడ్డి.

సర్వోదయలో అధ్యక్షుడుగా శ్రీ సూర్యబాబు ఉపాధ్యక్షుడుగా శ్రీ దేవేంద్రనాథ్, కార్యదర్శిగా శ్రీ మధుసూదనరావుఎన్నికైనారు;వేణుగోపాలస్వామి కాలేజిలో అధ్యక్షుడు శ్రీ ప్రతాప్‌రెడ్డి, ఉపాధ్యక్షుడు శ్రీ ప్రభాకరరెడ్డి, కార్యదర్శి శ్రీ పి.హెచ్. రవీంద్రయ్య.

### గూడూరు దేశం

గూడూరు టవున్ తెలుగుదేశం అధ్యక్షుడుగా శ్రీ ఆవుల కొండయ్య నియమింపబడినారు. పాత ప్రెసిడెంటు శ్రీ గౌస్ మొహిద్దీన్ రాష్ట్ర పార్టీ కోశాధికారికాగా, ఆ స్థానం కొండయ్యకు లభించింది.

కొండయ్యను తెలియనివారు, కొండయ్యకు తెలియనివారు బహుశా గూడూరులో వుండరు. దేశం మంచి పిట్టనే పట్టింది!

### తడ పోలీసు లాకప్‌లో చావు

తడ పోలీసుస్టేషన్ లాకప్‌లో 21తేది ఉదయం సల్లాబత్తుల పరిశుద్ధరావు అనే రైల్వే గ్యాంగ్‌మన్ చనిపోయాడట. అక్కంపేటలో జరిగిన ఒక దోపిడీకేసుకు సంబంధించి, పోలీసులు ఇతన్ని స్టేషన్‌కు లాక్కొచ్చారట. మరునటిరోజు అతని శవంమాత్రం మిగిలింది. పోలీసు లాఠీతో పరిశుద్ధరావు ప్రాణాలు తీశాయని ఆరోపణ; కాదు, కడుపునొప్పితో చనిపోయాడని పోలీసు అధికారుల వాదం. మెజిస్టీరియల్ దర్యాప్తు జరుగుతూంది; ఈలోగా సి.ఐ.,ఎస్.ఐ.ల నిద్దరి సస్పెండ్‌చేశారు.

పోలీసు లాకప్‌లో నిందితుల చావు సర్వసాధారణమైపోతుంది. ఈ దట్టపరమైన హత్యాకాండకు అంతంలేదా?

### నీటిమట్టం

| | |
|---|---|
| కనిగిరి రిజర్వాయరు | — |
| సర్వేపల్లి | 3 . 0 అ |
| నెల్లూరు చెరువు | 10 . 0 అ. |

### నెల్లూరు బజారు

| | |
|---|---|
| మొలగొలుకు 9672 | 1700-00 |
| 2508 | 1400-00 |
| ఐ. ఆర్ 20 | 1400-00 |

# సిల్క్‌స్మితపై ప్రీతి- జేబులు కర్పూరహారతి!

తమిళులకుగాని, ఇతర భాషలవారికిగాని సినిమా తారలంటే కాస్తోకూస్తో అభిమాన ముంటుంది కాని, మన తెలుగువాళ్ళ కున్నంత పిచ్చిలేదు. ప్రతిరోజూ మద్రాసు బీచ్ దగ్గరో, వండలూరు కొండవద్దో ఏదో ఒక షూటింగ్ జరుగు తూనే ఉంటుంది. ఎవరిపాటికి వాళ్ళు తమ పని మీద పోతూంటారే గాని, ఆ షూటింగ్‌ను అట్టే పట్టించుకోరు. ఒకవేళ ఆ షూటింగ్ దగ్గర ముగ్గురో నలుగురో మూగితే వాళ్ళు తప్పకుండా తెలుగు వాళ్ళే అయివుంటారు.

మనవాళ్ళు చాలామంది తిరుపతి యాత్రలో వెంకటేశ్వరస్వామికి మొక్కు లు చెల్లించి, కొండకింద అలమేలు మంగమ్మను దర్శించడమన్నా తప్పు తారుగాని, ఈ యాత్రలో ఒక భాగంగా మద్రాసులోని సినిమా తారలను దర్శించి తరించడం మానరు. ప్రతిరోజూ టూరిస్టు బస్సులలో వచ్చే వీరికి కొందరు "గైడు"లు తగులుతూంటారు. సినిమా తారలను చూపిస్తామంటూ కొంతడబ్బు వసూలు చేస్తుంటారు. ఒకరిద్దరు తారలు తప్ప ఈ యాత్రికులకు ఎక్కువ మంది తారల దర్శనం లభించదు.

అలాంటి గైడ్ ఒకతన్ని ఇటీవల మద్రాసులో పోలీసులు అరెస్టు చేశారు. అతనిపేరు మోహన్. వయసు 28. ఇతనికి బాష్షిన్, అలెక్స్ అనే మారుపేర్లు కూడా ఉన్నాయి. టిప్‌టాప్‌గా డ్రస్ చేసుకుంటాడు. సినిమా తారలను చూడాలనే మోజుతో వచ్చేవారిని ఇతగాడు ఎలాగో పసికట్టాడు. "వాహినీ స్టూడియోలో షూటింగ్స్ జరుగుతున్నాయి. జయమాలిని, సిల్క్‌స్మిత, అనూరాధ డ్యాన్స్ చేస్తున్నారు. చాలా సెక్సీ డ్రస్సుల్లో ఉన్నారు చూపిస్తాను రండి" అని వాళ్ళను లాక్కెళ్ళి, కోడంబాక్కం వరకు తీసుకెళ్ళేవాడు ఈ మోహన్. "చేతిగడియారాలతో స్టూడియోలోకి రానివ్వరు. మీ చేతులకున్న గడియారాలను తీసి నా కివ్వండి." అని తీసుకునేవాడు. ఆ తర్వాత "మీరిక్కడే ఉండండి. స్టూడియో లోపలికి వెళ్ళి పర్మిషన్ పాస్ తీసుకుని నిముషంలో వచ్చేస్తా." అంటూ స్టూడియో లోపలికి వెళ్ళి; స్టూడియోకు అవతలి వైపునవున్న 'బ్యాక్' గేటుగుండా జారుకునేవాడు.

**మా మద్రాసు సినీప్రతినిధి**

ఎంతసేపైనా అతగాడు తిరిగి రాక పోయేసరికి బయట కాచుకొనున్నవారికి విసుగెత్తి, చివరికి దగా జరిగిందని తెలుసుకుని, ఏడుపుముఖాలతో వెళ్ళిపోయే వారు.

ఇటీవలం మోహన్ చేస్తున్న దగా గురించి పోలీసువారికి తెలిసింది. నిఘా వేసి పట్టుకున్నారు. అతని వద్దనుంచి ఎన్నో గడియారాలు స్వాధీనం చేసు కున్నారు.

సినిమా తారల మీది పిచ్చితో వచ్చే వారిని దగాచేసే అఖండులు ఎందరో ఉన్నారు. అయినా, కలియుగ దైవమైన శ్రీనివాసుని దర్శించాక సిల్క్‌స్మిత లాంటి సినిమా తారలను చూడాలనే వ్యామోహం ఎందుకు? తమ వస్తువులు పోయాక అవన్నీ వెంకటేశ్వరునికే అర్పించినట్లు తలపోయడం ఎందుకు?

## "ఎయిడ్స్"గల నటి?

మన ముఖ్యమంత్రి విచిత్ర వేషధారణ తర్వాత అంతర్జాతీయ ప్రచారం జరుగుతున్నది. "ఎయిడ్స్" గురించే. హిందీ నటి జీనత్ అమన్‌కు ఈ భయంకర వ్యాధి సోకినట్టు టెస్టులవల్ల రూఢి అయిందట. ఈమె అనుదినం బొంబాయిలోని నానావతి హాస్పిటల్‌కు వెళ్ళివస్తూందట. ఈమె భర్త మజర్‌ఖాన్ దాదాపు విదేశాలకు వెళ్ళివస్తాడు. అతనిమూలంగా ఆమెకు ఈ వ్యాధి సోకివుండవచ్చుని ఒక బొంబాయి పత్రిక తెలియజేసింది.

## బాలసుబ్రహ్మణ్యం రాసినపాట

మధురగాయకుడు, సంగీతదర్శకుడు, నటుడు, డబ్బింగ్ ఆర్టిస్టు, వ్యాఖ్యాత వక్తగా తన ప్రతిభావిశేషాలను నిరూపించుకున్న ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం ఇటీవల కవికూడా అయ్యారు. జంధ్యాల డైరెక్టుచేసే "పడమటి సంధ్యారాగం" చిత్రానికి ఒక పాట రాశారు. హైదరాబాద్‌లో తొలిపాట రికార్డింగ్‌లో పాల్గొన్న ఘనత కూడా బాలసుబ్రహ్మణ్యానికే దక్కుతుంది. "ఈ ప్రశ్నకు బదులేది" చిత్రంకోసం జూబ్లీ హిల్స్‌లోని రాఘవ

—కొరవ 11వ పేజీలో





'పదహారేళ్ల అమ్మాయి' లో రాజేంద్రప్రసాద్, ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం, చిత్ర

# సర్వ అవలక్షణ సమన్విత చెత్త చిత్రం — బంధం

**చిత్ర సమీక్ష**
**సి. నారాయణరావు**

వినోద విజ్ఞానాల సమ్మిళితంగా, మనిషిని చైతన్యవంతుణ్ణిచేస్తూ మహత్తరంగా ముందుకు సాగాల్సిన బృహత్తర బాధ్యత కలిగిన సినిమాకళ నానాటికీ నిర్వీర్యమైపోతున్నది. నగుబాటుపాలవుతున్నది. మూసకథలు, సాగదీయబడడంతో విసుగుపుట్టించే సన్నివేశాలు, అనవసరపు సెంటిమెంట్లు ఈనాటి తెలుగు సినిమాల్లో ప్రధానాంశాలు. ఇలాంటి సర్వావలక్షణ శోభిత అష్టావక్రగా విడుదలైన మరో పెద్దసంస్థ తాజా చిత్రం రాజాచంద్ర 'బంధం'.

శ్రీమంతుడైన రావుగారి నిరాదరణకు గురవుతుంది, ఆయన్ని కాదని కులాంతర ప్రేమ వివాహం చేసుకున్న సోదరి కూతురు రాధ. ఆమెను పెళ్ళి చేసుకున్న రవీంద్ర, తండ్రి రావు ఆగ్రహానికి గురై బయటకు పంపించివేయబడతాడు. రవీంద్ర కార్మిక నాయకుడై కార్మిక పక్షాన నిలబడడంతో, ఆ ఫ్యాక్టరీ యజమాని అతడిపై కాల్పులు జరిపిస్తాడు. దాంతో అతడి మరణం ధృవీకరించుకున్న రాధ ఆస్పత్రి పాలవుతుంది. రావుగారి మనసు మార్చాలని ముద్దుముద్దు మాటల పాప ఆపాను ఆయనకు మచ్చిక చేస్తాడు, మిత్రుడు రహీం. ఆ పాపతో బంధాన్ని తెంచుకోలేని రావు తన తప్పును అంగీకరించి కథను సుఖాంతం చేస్తాడు.

సినిమా ప్రథమార్ధం అంతా విసుగుకు పరాకాష్టగా రూపొందించబడింది. అసలు ఈ చిత్రానికి ప్రథమ భాగమే అనవసర మనిపిస్తుంది. ముదునలి మహమ్మదీయుని వేషంలో రవీంద్ర, రాధ తన 'శిరీ'లాగా ఉందని చెప్పడం, అక్కడి వెకిలిచేష్టలు అసహ్యంగా చిత్రీకరించబడ్డాయి. రాధను, శోభనం సన్నివేశం అంతు నటించి తనకు రంజాన్ చూపమనడమంతటి 'అతి'స్థాయికి తీసుకెళ్ళడం దర్శకుని తప్పిదమే.

ఎం బి. ఎ. చదువుకున్న యువకుడు రవీంద్ర. ఆ చదువు తండ్రి ధనంద్వారా కొనబడిందని ఆ డిగ్రీతో ఉద్యోగం చేయటానికి అప్పుడదక్కపోవడం, కార్మికుడిగా పనిచేయడం చాలాఎబ్బెట్టుగాకనిపిస్తుంది. తండ్రి ఆస్తిని కాదనుకుని తాను కష్టపడి తన తెలివితేటల్తో సంపాదించుకున్న డిగ్రీ కేవలం తండ్రిడబ్బుతో సంపాదించి నట్లుచూపడం విచక్షణారహితమైననిర్ణయ మనిపిస్తుంది. ఇది కేవలం సినిమోచితం!

చిత్రం ద్వితీయార్థంలో పాప ముద్దు ముద్దు మాటలు, పెద్దరికాన్ని తెచ్చిపెట్టుకున్న ఆమె గంభీరమైన నటన ప్రేక్షకుల్ని సేదదీరుస్తుంది. ఇంట్లో దేవుని మందిరం తలుపుల్ని శాశ్వతంగా బంధించమని శాసించిన 'రావు', నిరంకుశత్వం కల్గిన ఆ పాత్ర మలచడంలో లోపం వలననేమో, ప్రేక్షకుడి సానుభూతికి నోచుకోలేకపోయింది. అతనిలో మార్పును కూడా ఆనందదాయకంగా ఆదరించలేని స్థితి ప్రేక్షకుడిది. వ్యాపారంలో పను ఉత్తీ ఐకాని, పోటీదారులుకాని తమ దొంగ చక్రాన్ని ఉపయోగించి ఎదుటివారి వ్యాపారపరంగా దెబ్బగొట్టడానికి ప్రయత్నిస్తారేతప్ప ఈ చిత్రంలోలాగా దారి కాయడం, అపహరించడం లాంటి జనం బద్ద చేష్టలు చేయరు!

పటకాపరంగా చెలి పాలిని సమున్నతంగా నటించింది. శోభన్ ద్విపాత్రాభినయంలోను, రాధిక నటనలోను ప్రత్యేకత లేదు. శ్రీధర్, నూతన్ ప్రసాద్ చక్కనినటన ప్రదర్శించగల్గారు. పూసల మాటల అల్లికల్లో 'శారం', మమ'కారం' లాంటి ప్రయోగాలు కన్పించినా, ఆ మాటలు మనల్ని పలుకరించవు. ఇక కవిత్వంచడం నవ్వించడం ఎలాసాధ్యం!

మొత్తానికి చిత్రమంతా పాత సినిమా రూపాన్ని సంతరించుకొని కొద్దిపాటి క్రొత్తదనాన్ని కూడా అందించలేకుండా పోయింది. ★

# సినిమా

(9వ పేజీ తరువాయి)

నిర్మాణం కాబడుతోంది కూడా 20 తేదీన రెండు పాటలు పాడారు.

## హైదరాబాద్‌లో సెన్సార్ కార్యాలయం నిద్రపోతూంది

హైదరాబాద్‌లో సెన్సార్ కార్యాలయం పుంగాలని ఎందరో చిత్రప్రముఖులు, రాష్ట్ర ప్రభుత్వం విజ్ఞప్తులు చేసిన ఫలితంగా ఏకాదిక్రికం న్యూ ఎం.ఎల్.ఏ క్వార్టర్స్ ఎదురుగా ఒక కార్యాలయం ఏర్పాటు చేయబడింది. అక్కడ ఒక ఆఫీసరు, ఒక అటెండరు మాత్రమే వున్నారు. మిగతాసిబ్బందిలేరు. వారిని నియమించేవిషయంలో రాష్ట్ర చలనచిత్ర అభివృద్ధిసంస్థ జాప్యంచేస్తూంది. అసలు రాష్ట్రప్రభుత్వం నుంచి చెప్పుకోదగిన తాత్కాలికంగా కొంతమంది సిబ్బందిని తీసుకోవడానికి కేంద్రప్రభుత్వం అనుమతించింది. అందుచేత, ఇంత తాత్సారం జరగడానికి రాష్ట్రప్రభుత్వం, చిత్రనిర్మాతలు కూడా కొంతవరకు బాధ్యులని చెప్పక తప్పదు.

## నెల్లూరీయుడు కె. యస్. ఆర్. దాస్ చిత్రం

వెంకటగిరి వాస్తవ్యులైన కె. యస్. ఆర్. దాస్ క్రయిమ్ చిత్రాలను రూపొందించడంలో దిట్ట. ఈయన కథ, స్క్రీన్‌ప్లే దర్శకత్వం, సమర్పణలో ఈయన పుత్రుడు కె. మధుమార్ "కౌబాయ్ నెంబర్ 1" అనే చిత్రాన్ని నిర్మిస్తున్నారు. ఈ చిత్రంకోసం తిరుపతి, తలకోన ప్రాంతాలలో కొన్ని భారీ సెట్లు ప్రత్యేకంగా నిర్మించి ప్రధాన సన్నివేశాలను చిత్రీకరించారు. ఈ చిత్రంలో అర్జున్, రజని, కోట శ్రీనివాసరావు, భీమరాజు, అనూరాధ నటిస్తున్నారు.

## సినీనటిపై దౌర్జన్యం

"సిరి వెన్నెల" చిత్రంలో నటించిన మున్‌మున్‌సేన్ సుప్రసిద్ధ బెంగాలీనటి, దర్శకురాలు అపర్ణాసేన్ పుత్రిక. జులై 15 న ఈమె కలకత్తాలోని తన నివాసం బయటకువచ్చినప్పుడు అరుగురువ్యక్తులు బలవంతంగా కారులోకినెట్టి ఎత్తుకుపోవడానికి ప్రయత్నించారు. ఆమె కేకలకు, చుట్టుప్రక్కల ఉన్నవారంతా ఎకాయెకిన రావడంతో దుండగులలో నలుగురు పారిపోయారు. మిగతా ఇద్దరినీ పోలీసులు ఖైదుచేసి, ఆ కారును స్వాధీనం చేసుకున్నారు. అరెస్టయినవారిలో ఒకరు హోటల్ యజమాని పింటీసింగ్, మరొకరు వాల్ లాలాఖానా. వీళ్ళు చాలా కాలంగా ఆమెను అపహరించి ఎత్తుకుపోవడానికి ప్రయత్నిస్తున్నట్లు వెల్లడైంది.

## రామోజీరావు చిత్రం "కారుదిద్దిన కాపురం"

రామోజీరావుకు ప్రజలనాడి బాగా తెలుసు. వెరైటీ కథలతో చిత్రాలు తీయాలని ఈయనకతపన. ఈమారు అత్యంత తరుపుల్ని పన్నించే చిత్రం "కారుదిద్దిన కాపురం" నిర్మించారు. ఇందులో రాజకీయ నాయకులమీద విమర్శలు వుంటాయి. ప్రముఖ రచయిత డి. వి. నరసరాజు తొలిసారిగా డైరెక్టు చేస్తున్న చిత్రమిది. నూతన ప్రసాద్, నాగేష్, రాజేంద్రప్రసాద్, రమాప్రభ, మమత, పవిత్ర, వేలు, మాడా, శ్రీలక్ష్మి, డిస్కోశాంతి, వై విజయ, పద్మనాభం, కమలాకర్, కల్పనారాయ్ నటించారు.

---

# ఆంధ్రా బ్యాంకు - నెల్లూరు బ్రాంచి

ట్రంకురోడ్డు — నెల్లూరు ఫోన్: 6458

# బంగారు నగల వేలం

ఈ క్రింద తెలియబరచినవారు మా బ్యాంకులో బంగారు నగలు కుదువయుంచి విడిపించుకొననందున 30-8-86 తేది శనివారం మధ్యాహ్నం 3 గంటలకు మా బ్యాంకు ఆవరణలో బహిరంగ వేలం వేయబడును వేలంలో పాల్గొనదలచినవారు రు. 500/- లు ధరావత్తు చెల్లించి పాటలో పాల్గొనవలయును. వేలంతేదీని ఎట్టినోటీసులు లేకుండనే వాయిదా వేయుటకు వేలంను నిలుపుచేయుటకు బ్యాంకువారికి అధికారముకలదు. ఇతర వివరములు బ్యాంకు పనిచేయువేళలలో తెలుసుకొనవచ్చును.

| నెం. | Gl. No. | పేరు, అడ్రసు | బంగారు నగలు | తూకం గ్రా. | ధర |
|---|---|---|---|---|---|
| 1. | 41/459 | కోట జానకిరామిరెడ్డి పేడూరుగ్రామం నెల్లూరుజిల్లా-524311 | .. | 43 | 5,180 |
| 2. | 43/147 | ఐ. భాస్కరనాయుడు పూడిపర్తి, నెల్లూరుజిల్లా | .. | 67 | 7,700 |
| 3. | 43/171 | వేళ్ళ చెన్నయ్య తండ్రి వీరయ్యనాయుడు, సౌత్ ఆములూరు పోస్టు తోటపల్లిగూడూరు మండలం నెల్లూరుజిల్లా | .. | 43 | 4,480 |
| 4, | 44/1 | దువ్వూరు బాలక్రిష్టారెడ్డి తండ్రి సుబ్బరామిరెడ్డి బనవాయపల్లె వెంకన్నపురం పోస్టు కోవూరు తా. నెల్లూరుజిల్లా | .. | 154 | 23,000 |
| 5. | 44/50 | కొమ్మరి పెదపిచ్చయ్య తండ్రి సుబ్బయ్య పొన్నపూడి చిన్నపాళెం కోవూరుతాలూకా | .. | 40 | 5,600 |
| 6. | 44/62 | యల్లా వీరరాఘవరెడ్డి తండ్రి వెంకురెడ్డి, కనుపర్తి పాడుగ్రామం నెల్లూరుజిల్లా | .. | 50 | 7,000 |
| 7. | 44/66 | రావి జయరామనాయుడు ఈదూరుగ్రామం తోటపల్లిగూడూరుమండలం | .. | 29 | 3,500 |
| 8. | 44/68 | Ch. వీరయ్య, కొత్తమిట్టపాళెం, నెల్లూరు | .. | 19 | 2,240 |
| 9. | 44/75 | యం. శ్రీనివాసులురెడ్డి 20-39-B/1 బాలాజీనగర్ నెల్లూరు-524002 | .. | 63 | 88,20 |
| 10. | 44/80 | N. V. రాఘవరెడ్డి అసిస్టెంట్ డైరెక్టర్ (ఎనిమల్ హస్పెండరీ) వెంకనపాళెం, నెల్లూరుజిల్లా | .. | 53 | 7,420 |
| 11. | 44/81 | పి. హరిశ్చంద్రారెడ్డి కనుకర్తిపాడుగ్రామం నెల్లూరుజిల్లా | .. | 40 | 5,600 |
| 12. | 44/85 | టి. మునెయ్యనాయుడు తండ్రి నరసయ్యనాయుడు, 2nd లైన్, హరనాథపురం నెల్లూరు | .. | 55 | 7,700 |
| 13 | 44/90 | వి. అవిశేషారెడ్డి తండ్రి సీతారామిరెడ్డి యల్లాయపాళెం, కోవూరుతా॥ | .. | 37 | 4300, |
| 14. | 44/95 | జి రామచంద్రయ్య తండ్రి రోశయ్యనాయుడు 13/45 హరనాథపురం, నెల్లూరు | .. | 137 | 19 180 |
| 15. | 44/108 | తిక్కవరపు శేషురెడ్డి తండ్రి బలరామిరెడ్డి ఈదులవారిపాళెం, బ్రహ్మదేవి పోస్టు | .. | 36 | 5,540 |
| 16. | 44/112 | మేకల చిన్నయ్య తండ్రి పీరయ్య W 1/313, నవాబుపేట నెల్లూరు-2 | .. | 51 | 7,140 |
| 17. | 44/122 | ఎస్. ఉమామహేశ్వరరావు సిద్ధనరసుపాడు, ఆమంచర్ల పోస్టు, నెల్లూరుజిల్లా | .. | 49 | 5.460 |
| 18. | 44/132 | కొండూరు శ్యామలమ్మ C/o కె. బలరామిరెడ్డి మానేగుంటపాడుగ్రామం | .. | 32 | 4,480 |
| 19. | 44/133 | వేమారెడ్డి వెంకటసుబ్బారెడ్డి తండ్రి వి. వెంకటరామిరెడ్డి పాపిరెడ్డిపాళెం తోటపల్లిగూడూరుమండలం | .. | 37 | 5.180 |
| 20. | 44/135 | అడపాల జనార్ధనరెడ్డి తండ్రి చెంచురెడ్డి కాకితలుపూరుగ్రామం పిడూరుపోస్టు, గూడూరు తా॥ | .. | 86 | 12,040 |
| 21. | 44/141 | పన్నూరు సుందరరామిరెడ్డి తండ్రి రంగారెడ్డి, ఈదూరుగ్రామం నెల్లూరుజిల్లా | .. | 103 | 14,420 |
| 22. | 44/144A | మనుబోలు పట్టాభిరామిరెడ్డి, తండ్రి ఆదినారాయణరెడ్డి పెదచెరుకూరు, నెల్లూరుజిల్లా | .. | 107 | 14,980 |
| 23) | 44/158 | పోకూరు సుందరరామిరెడ్డి, తండ్రి- వెంకటరెడ్డి, గండవరం, నెల్లూరుజిల్లా | .. | 62 | 8680 |
| 24) | 44/165 | టి. ప్రభాకరరెడ్డి, తండ్రి రామిరెడ్డి, నార్తుమోపూరు, కోవూరుతా॥ | .. | 84 | 11760 |
| 25) | 44/169 | కె. రామానాయుడు, తండ్రి కె. చంద్రయ్యనాయుడు, చవటపాళెం, నెల్లూరుజిల్లా. | .. | 60 | 8400 |
| 26) | 44/174 | పోలుబోయిన రమణయ్య, తండ్రి శేషయ్య, 20/321, మూలాపేట, నెల్లూరు | .. | 66 | 9240 |
| 27) | 44/192 | కొండపూడి సుబ్బారెడ్డి, తండ్రి దశరథరామిరెడ్డి పాట్టీపాళెం-నెల్లూరుజిల్లా. | .. | 37 | 4200 |
| 28) | 44/208 | ఏటూరి బంగారురెడ్డి, తండ్రి చెంచురామిరెడ్డి, అల్లూరుపోస్టు-నెల్లూరుజిల్లా, | .. | 57 | 7400 |
| 29) | 44/210 | కల్లంరెడ్డి రమణారెడ్డి, కొత్తపాళెం | .. | 28 - | 3920 |
| 30) | 44/227 | కరేటి రమణయ్య, తండ్రి నరసయ్య అల్లిపురం-నెల్లూరుజిల్లా, | .. | 34 | 3500 |
| 31) | 44/228 | షేక్ కాశీసాహెబ్, తండ్రి రాజాసాహెబ్, కొగిలి వాకాడు తా॥ నెల్లూరుజిల్లా, | .. | 60 | 5500 |
| 32, | 44/237 | జి. అశోక్‌కుమార్‌రెడ్డి, తండ్రి చెంచురెడ్డి, పొట్టేంపాడు గ్రామం | .. | 79 | 10500 |

-మేనేజరు

ఆంధ్రాబ్యాంకు - నెల్లూరుబ్రాంచి

**శ్రీ H. సుదర్శనరావు**

జననం:
10-9-1919

మరణం:
13-7-1986

నిరాడంబరవ్యక్తి, స్నేహశీలి - మేధావి రెండునెలల అస్వస్థతతో తోబుట్టువులను, బంధువులను, అశేష స్నేహబృందాన్ని శోకతప్తులనుచేసి, దివంగతులైనారని తెలుపుటకు విచారిస్తున్నాము.

| సోదరులు : | సోదర - సోదరీలు |
|---|---|
| కెంచం నారాయణరావు | హరిదాస్ శ్రీనివాసరావు |
| కెంచం పురుషోత్తమరావు | హరిదాస్ అనసూయాదేవి |



మా యింటి జ్యోతి, నిరంతరం మా హృదయాంతరాలలో
వెలిగే జ్యోతి, మా అభివృద్ధికి కారకులు,
అనురాగంతో మమ్ములను తన గుండెలలో దాచుకున్న ప్రేమమయుడు,

మా తండ్రి

# మాగుంట రాఘవరెడ్డి గారి

# నవమ వర్ధంతి

1-8-86 శుక్రవారం పేడూరు గ్రామంలో జరుపబడును.

వారి పవిత్రాత్మకు మా శ్రద్ధాంజలులు.

-మాగుంట సుబ్బరామరెడ్డి అండ్ బ్రదర్స్
-సిద్ధవరపు మధుసూదనరెడ్డి - (అల్లుడు)

సంపాదకుడు, ముద్రాపకుడు, ప్రకాశకుడు నెల్లూరు శ్రీరామమూర్తి. జమీన్‌రైతు ప్రెస్. 17/170. విశ్వరాజువారి వీధి, నెల్లూరు-524001